## బ్రహ్మలెవరు? వారికాలములు

ఇంతవరకు మన పూర్వులు కాలమును లెక్కించుటకై యుగాలు, కల్పాలు, వగైరాలు యేర్పరచి యవి పూర్వరాజన్యాది ప్రముఖుల పేర్లను మనకు తెలిపినట్లు లోగడ గ్రహించితిమి. అట్లే బ్రహ్మలవిషయములో గూడ నైయుండెను. మొట్టమొదట మన దేశమునకు వచ్చినవారినే బ్రహ్మలనియు, ప్రజాపతులనియు మన పురాణములందు వర్ణించిరి. వీరినుండియే దేవతలు, రాక్షసులు, మానవులు మున్నగు జాతులు క్రమముగా నేర్పడినట్లుందుగలదు. క్రీస్తుపూర్వము రమారమి 7838 సం॥ల క్రిందట కొందరు బ్రహ్మలనబడువారును, వారి పెద్దయగు స్వాయంభువమనువును మన హిందూదేశమునకు వచ్చి నివసించినట్లు కనబడుచున్నది. వీరి జాతి, మత వర్గీయులు కొందఱు ఇరానుదేశములోగూడ నున్నట్లు అచటి యవెస్తా గ్రంథములను బట్టి తెలియుచున్నది. రుచిప్రజాపతి, కర్దమప్రజాపతి, మరీచి ప్రజాపతి మున్నగువారే మనదేశమున గాలిడినవారు. మొదటిబ్రహ్మకు 10 మంది బ్రహ్మలు కలిగినట్లును, వారే దక్షుడు, నారదుడు, పులహుడు, భృగువు, క్రతువు, అంగీరసుడు, వశిష్ఠుడు, మరీచి, అత్రి, ధర్ముడు, కర్దముడను వారలనియు గలదు. ఆ బ్రహ్మకు జనించిన యాణియను సరస్వతిని వయసు వచ్చిన పిమ్మట వాడే చేపట్టెనట. దాని కాతని కుమారులాక్షేపించినను చెల్లిపోయెనట. ఈ ప్రజాపతులను బ్రహ్మలందరును స్వంత సోదరీమణులను, పినతండ్రి పెదతండ్రి కుమార్తెలను తరచుగా మొదట వివాహమాడుచుండిరి గాని కుమార్తెలను చేపట్టలేదు. ఇందలి భృగువుకుమార్లు ధాత, విధాత యనువారు. వీరు క్రమముగా బ్రహ్మలైరి. ఈభృగువునకు శ్రీదేవి యను కొమరిత గూడ యుండెను. ఈమె విష్ణువుభార్య యయ్యెను. ధాత మున్నగువారు ఆనాటి ప్రజలకు సాముద్రిక, జ్యోతిషములు చెప్పుచుండిరి. అందువల్లనే ధాత వ్రాలు తప్పదను నార్యోక్తి ప్రబలెను. భృగుమహర్షి తండ్రి వరుణుడనియు, తల్లి చర్షి యనునామె యనియు భాగవతమున నున్నది. వరుణుడు గూడ బ్రహ్మలలోనివాడే. ధాతకు సాయమ, దర్శ, ప్రాతరాఖ్య, పూర్ణిమాఖ్యులను సుతులుండిరి. ఈప్రజాపతులనబడు బ్రహ్మలపేరిటనే మనవారు సృష్టికి కారణభూతుడగు బ్రహ్మసృష్టి నిర్ణయమును ఊహించి పురాణములందు క్రతపరచిరి. విధాతకు అగ్ని పురీష్యాదులనువారు జనించిరి.



ఈ యగ్ని యింద్రసామంతుడయ్యెను. వీరందరును మొదట వారిలో వారికి జనించిన కన్యలను పెక్కండ్రను వివాహమాడి, వారి వంశములను మిక్కిలి వృద్ధిజేసిరి. తర్వాతవచ్చిన బ్రహ్మలనేకులీరీతిగనే ప్రజలనుసృజించిరి. క్రమముగా వీరల ఆడ మగపిల్లల సంతతియే మన హిందూదేశవాసులందరు నని మన పూర్వగ్రంథములు కంఠోక్తిగ నుడువుచున్నవి. తత్పూర్వీకులగు దేశవాసులు వీరలచే క్రమముగా వశింపుచేయబడిరి. అంతేగాని బ్రహ్మలన వేరేలోకమున నెచటనో నివసించి వారి ప్రపంచసృష్టి జేయుచున్నారన గూడదు. అట్టివ్రాత లెందున్నను ప్రమాణములుగా గన్పడవు. జగత్తునకంతటి కాధారభూతమగు జగదీశ్వర నిర్మాణారంభమునుగూర్చి నిజముగా నేరికిని సంపూర్ణముగ దెలియదు. అట్టి యీశ్వరునకీ బ్రహ్మలను, విష్ణువులను, శివులను ముడిపెట్టి వారికి మహత్తులను గల్పించి పురాణములందు వర్ణింపబడినను, నిజము చెప్పక తప్పలేదు. ఒకానొక బ్రహ్మకుమారుడగు స్వాయంభువు తన సోదరియైన శతరూపను చేపట్టెను. వీరే మనకు తెలిసిన మనదేశపు ఆదిదంపతులు. వీరికి 2 కుమారులును, 3 కుమార్తెలును కల్గిరి. ఈ కుమార్తెలు ఆకూతి, ప్రసూతి, దేవహూతి యనువారు వరుసగా రుచిప్రజాపతి, దక్షప్రజాపతి, కర్దమప్రజాపతు లనువారిని చేపట్టిరి. మరీచికి కశ్యపప్రజాపతి జనించెను. కర్దమప్రజాపతి కుమార్తె కళ యను నామె మరీచికి భార్యగానుండెను. ఈమెవల్లనే కశ్యపబ్రహ్మ కల్గెను. ఇతడు దితి, అదితి యను యిర్వురకన్యలను మొదట చేబట్టెను, వారివలన సమస్త దేవతలు, రాక్షసులు క్రమముగా ఉత్పత్తియైనట్లు చెప్పబడినది. దక్ష ప్రజాపతికి జనించిన యనేక కన్యలనుగూడ యీయన చేబట్టి చాల సంతానము గనెను. ఈ రీతిగా బ్రహ్మలందరును మనదేశమున మొదట ప్రజావృద్ధి గావించుకొనుచు వారి దేశమునకు బ్రహ్మావర్తమని పేరుపెట్టుకొని దానిని మనువు పాలనలో నుంచిరి. ఈ బ్రహ్మలు క్రమముగా కొందరు దేవతలను కల్పించుకొని పూజించుచుండిరి. వారి కప్పుడు ప్రకృతిలో నుపకారము గావించుచువచ్చిన మహత్తరవస్తుజాలములన్నియు దేవతలుగానే భావించిరి.

ఇంద్రుడు, సూర్యుడు, చంద్రుడు, వరుణు లేక వర్షదేవత, ఉషఃకాలము, సాయంకాలములందలి యాకాశము, వాయువు, అగ్ని, జలము మొదలైనవన్నియు వారు దేవతలుగా దలచి, వారి పేరట తమ పిల్లలపేర్లు గూడ బెట్టుకొనుచుండిరి. ఈ దేవతలపై క్రమముగా వారపుడు మాటలాడు